# నమ్మాళ్వార్

Dinesh Ramanuja Dasa   September 11, 2013

శ్రీః
శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః
శ్రీ వానాచల మహామునయే నమః

క్రిత పంచికలో మనం సేనముదలియార్ (విష్వక్సేనులు)  గురించి చదివాము. ఇప్పుడు  నమ్మాళ్వార్  గురించి  పరిశీలిద్దాం.



**తిరునక్షత్రం** ~: వైశాఖ మాసము, విశాఖా నక్షత్రం.
**అవతారస్థలం** ~: ఆళ్వార్ తిరునగరి
**ఆచార్యులు** ~: విష్వక్సేనులు
**శిష్యులు** ~: మధురకవి ఆళ్వార్, నాథమునులు తదితరులు

నమ్మాళ్వార్ కు  కారిమారన్, శఠగోపులు, పరాంకుశులు, వకుళాభరణులు, వకుళాభిరాములు, మఘిళ్ మారన్, శఠజిత్ మరియు  క్కురుగూర్ నంబి అను నామధేయములు ఉన్నవి.

కారి మరియు ఉడయనంగై అను పుణ్యదంపతులకు తిరుక్కురుగూర్ (ఆళ్వార్ తిరునగరి) అను గ్రామమున నమ్మాళ్వార్ జన్మించిరి.  కలియుగం ప్రవేశించిన కొద్ది రోజులకు నమ్మాళ్వార్  అవతరించిరి. భగవద్గీత లో గీతాచార్యుడు ఈ విధముగా చెప్పెను "**అనేక జన్మల తరువాత కనపడునది కనపడనిది మొత్తం**

**వాసుదేవునకు చెందును అన్న అభిప్రాయమునకు వచ్చును. అలాంటి జ్ఞానులు అరుదుగా కనపడతారు”.** ఎమ్పెరుమాన్ కు అప్పుడయిన నమ్మాళ్వార్ జీవితమును మరియు వారి శ్రీసూక్తి గ్రంథములను చూసి వీరు ఇలాంటి జ్ఞానియే అని నిర్ధారణ చేయవచ్చును. వీరి జీవిత కాలము ( 32 సంవత్సరములు) మొత్తము చింతచెట్టు (తిరుపుళియాళ్వార్) క్రిందనే ఉండెను. నిత్యము యోగము నందు భగవానుని గురించి స్మరించుచుండెడివారు. తిరుక్కురుగూర్ అనే శబ్దము వినగానే (తిరువాయ్ మొళి సేవించు సమయమున ప్రతి పదిగమ్ చివరి పాశురములో నమ్మాళ్వార్ పేరు మరియు పేరుకు ముందు వీరు అవతరించిన స్థలము క్కురుగూర్ అని వచ్చును. ఆళ్వార్ తిరునామం మరియు అవతారస్థలం ఉచ్చరించగానే, దక్షిణ దిశగా(ఆళ్వార్ తిరునగరి – ఆ దిశ లో ఉన్నందున ) అంజలి సమర్పించాలి అని మన పూర్వాచార్యులు నియమనం.

నమ్మాళ్వార్ ప్రపన్న జనకూటస్థులుగా పరిగణింపబడతారు, అనగా ప్రపన్నగోష్ఠి కి ప్రప్రథములు అలాగే వైష్ణవ కులపతిగా కీర్తింపబడ్డారు. ఆళవందార్ తమ స్తోత్ర రత్నమున 5వ శ్లోకమున – తనకు, తనవారికి మరియు తన తరువాతి తరాలకు అందరికి సర్వం అయిన ( అనగా తండ్రి, తల్లి, తనయులు మరియు ధనము మొ|| ) వకుళాభిరాముల పాద పద్మములకు ప్రణమిల్లుతున్నానని స్తుతించారు.




ఆళ్వార్ శయన తిరుక్కోలం వీరి పాదాల వద్ద రామానుజులు(భవిష్యదాచార్యులు)వారు- ఆళ్వార్ తిరునగరి

ఎమ్పెరుమానార్ (శ్రీరామానుజులు) (ఆది శేషుల అవతారమయినప్పటికి) **“మాఱన్ అడి పనిందు ఉయ్ త్తవన్ “** అనగా నమ్మాళ్వార్లకు శరణాగతి చేసి తరించెనని ప్రసిద్ధి పొందెను.

నంపిళ్ళై పూర్వాచార్యుల గ్రంథములను ఆధారము చేసుకొని, వారి ఈడు వ్యాఖ్యాన అవతారికలో మరియు తిరువిరుత్తం వ్యాఖ్యాన అవతారికలో ఎమ్పెరుమాన్ లీలావిభూతిలో నమ్మాళ్వార్లను బద్ధజీవుడను శ్రీవైష్ణవునిగా

తీర్చి దిద్దుటకు ఎంచుకున్నారని ధృవీకరించిరి. నమ్మాళ్వార్ల మాటలను ఆధారముగా చేసుకొని ఈ విషయం ప్రతిపాదించెను. ఎమ్పెరుమాన్ తన నిర్హేతుక కృపాకటాక్షముచే నమ్మాళ్వార్ కు జ్ఞానమును ప్రసాదించెను. ఆళ్వార్ ఈ జ్ఞానము చేత భూత,భవిష్యత్ వర్తమానములను చూడగలిగిరి. తమ శ్రీసూక్తములలో పలుమార్లు ఈ సంసారమందు అనాదిగా చిక్కుకొని ఉన్నారని ఇక ఒక్క క్షణమయిన ఉండలేనని భగవంతునికి విన్నవించెను. వీరికి సంసారమున ఉండుట , సూర్యుని తాపమునకు వేడి అయిన ఎర్రని నేలపై పాదరక్షలు లేకుండ నిలబడినట్లుగా ఉన్నదని భావించిరి. తిరువాయ్ మొళి మొదటి పాశురమున తమకు ఎమ్పెరుమాన్ జ్ఞానమును అందించి తరింపచేసెనని వెల్లడించిరి. ఈ ప్రకారముగా వీరు కూడ సంసారి ( బద్ధ జీవాత్మ) అని ఎమ్పెరుమాన్ కృపచేత మాత్రమే జ్ఞానము లభించినదని మనం అర్థం చేసుకోవాలి. ఇదే ప్రకారము (తర్కము) ఇతర ఆళ్వార్లకు కూడ వర్తించును. ఎందుకనగా

- నమ్మాళ్వార్ అవయవి మిగితా (ఆండాళ్ కాక) ఆళ్వార్లు అవయవాలుగా స్థితమై ఉన్నారని ప్రసిద్ధి.
- ఆళ్వార్లు తాము సంసారమున ఉన్నామని కేవలం ఎమ్పెరుమాన్ కృపచేతనే తమకు జ్ఞానమును కలిగినదని తమతమ శ్రీసూక్తములయందు వెల్లడించిరి.

నమ్మాళ్వార్ అనుగ్రహించిన 4 దివ్య ప్రబంధములు.

- తిరువిరుత్తం (ఋగ్వేద సారం)
- తిరువాశిరియమ్ (యజుర్వేద సారం)
- పెరియ తిరువన్దాది (అథర్వ వేద సారం)
- తిరువాయ్ మొళి (సామవేద సారం)

నమ్మాళ్వార్ల 4ప్రబంధములు 4 వేదములతో సమానము. వారికి **"వేదమ్ తమిళ్ శెయ్ ద మారన్"** అనగా సంస్కృతవేద సారమును తమిళం అందించిన వారు అని బిరుదు. మిగితా ఆళ్వార్ల ప్రబంధములు వేద సంపూరక భాగములుగా (అనగా శిక్ష, వ్యాకరణము మొ||) ప్రసిద్ధి. తిరువాయ్ మొళి ఆళ్వార్లు పాడిన 4వేల పాశురములకు సారముగ కీర్తింపబడినది. మన పూర్వాచార్యుల గ్రంథములు (వ్యాఖ్యానములు మరియు రహస్య గ్రంథములు) తిరువాయ్ మొళి లోని జ్ఞానమును ఆధారముగ చేసుకొని రచించబడ్డాయి. తిరువాయ్ మొళికి ఐదు వ్యాఖ్యానములు మరియు **అరుంబదము** లో విస్తృత వ్యాఖ్యానము ఉన్నది .

మన పూర్వాచార్యులు నమ్మాళ్వార్లకు శ్రీదేవి, భూదేవి, నీళా దేవి, గోపికలు, లక్ష్మణ, భరత, శతృఘ్న, దశరథ, కౌసల్య, ప్రహ్లాద, విభీషణ, హనుమ, మరియు అర్జున మొదలగు భక్తుల గుణములు ఉన్నవని నిర్ణయించిరి. కాని వీరందరు నమ్మాళ్వార్ల గుణములలో ఏదో ఒక గుణము మాత్రమే కలిగి ఉన్నారని పూర్వాచార్యుల ఉవాచ- ఇదే నమ్మాళ్వార్ వైశిష్ఠ్యము.

తిరువాయ్ మొళి – పలరడియార్ మున్బరుళియ (7.10.5) – నమ్పిళ్ళై చాలా అందముగా నమ్మాళ్వార్ల తిరువుళ్ళమును(మనోభావన) వెలికి తీసిరి. ఈ పాశురములో – ఎమ్పెరుమాన్, తమిళములో నిష్ణాతులైన ముదలాళ్వార్ల కంటే మరియు మహాఋషులైన శ్రీవేదవ్యాసులు, శ్రీ వాల్మీకి, శ్రీ పరాశరులు కంటే అతిరిక్తముగా తమకు మాత్రమే తిరువాయ్ మొళిని పాడుటకు కృపచూపి అనుగ్రహించారని నమ్మాళ్వార్ల విన్నవించారు.

నమ్మాళ్వార్ గంగ, యమున మరియు సరస్వతి కన్న ఉత్తమ్మోత్తమ పవిత్రతను కలిగిన **త్రామ్రపర్ణి** నదీ తీరమున ఉన్న **తిరుక్కురుగూర్** అను గ్రామమున అవతరించిరి. ప్రపన్నకులంలో ఉన్న కారి అను వారికి కుమారుడిగ జన్మించెను. తిరుమళిశై ఆళ్వార్లు అనుగ్రహించినట్లు "**మఱన్దుమ్ పుఱం తొళ మాన్దర్**" – ప్రపన్నులు కేవలం శ్రీమన్నారాయణుడిని తప్ప అన్యులను ఆరాధించని వ్యక్తిత్వము కలవారని. నమ్మాళ్వార్ల 7 తరముల పూర్వులు- తిరువళుత్తి వళనాడర్, వారి కుమారులు అఱన్తాఙ్గియార్, వారి కుమారులు చక్రపాణియర్, వారి కుమారులు అచ్యుతర్, వారి కుమారులు శెందామరై కణ్ణార్, వారి కుమారులు పొఱ్కారియార్ వారి కుమారులు కారియర్, వారి కుమారులు మన నమ్మాళ్వార్.

పొఱ్కారియార్ తన కుమారుడైన కారికి ఉత్తమ వైష్ణవ కుటుంబ కన్యతో వివాహము చేయదలచి రాబోవు తరములలో వైష్ణవులు జన్మించి లోకానికి ఉద్ధరించాలనే సదుద్దేశ్యముతో వైష్ణవుల ఇంటి అమ్మాయిని వెతుకుచుండిరి. పొఱ్కారియర్ ఒకనాడు తిరువణ్ పరిశారం అను దివ్యదేశమునకు వెళ్ళెను. అక్కడ తిరువాళ్ మార్భర్ అను ఒక వైష్ణవుడిని కలిసెను. వారు కూడ వారి కుమార్తెకు ఉత్తమవైష్ణవ వరుడిని చూస్తున్నట్లుగ తెలుసుకొని వారి కుమార్తె అయిన ఉడైయనన్గైను కారియార్ కు ఇచ్చి వివాహము చేయుటకు నిశ్చయించుకొనిరి. కారియర్ మరియు ఉడయనన్గై ఇరువురు తిరువణ్ పరిశారం నందున్న తిరువాళ్ మార్భన్ ఎమ్పెరుమాన్ ను దర్శనం చేసుకొని తిరుక్కురుగూర్ వెళ్ళిరి. శ్రీ రాముడు ఆనాడు సీతా పిరాట్టిని వివాహము చేసుకొని అయోధ్యకు వేంచేసినప్పుడు ఆ పురజనులు సంబరాలు జరపుకుని ఎంతటి ఆనందమును పొందినారో అదే విధముగ తిరుక్కురుగూర్ ప్రజలు కూడ నూతన

దంపతులను చూసి ఎంతో ఆనందోత్సాహములు చేసుకున్నారు.

కొన్ని రోజుల తరువాత కారియార్ మరియు ఉడయనన్గై తిరువణ్ పరిశారంనకు వెళ్ళి స్వామి దర్శనము చేసుకొని తిరుగుప్రయాణములో తిరుక్కురుంగుడి నంబిపెరుమాళ్ ను దర్శనము చేసుకొని తమకు కుమారుడిని ప్రసాదించమని నంబిపెరుమాళ్ ను ప్రార్థించిరి. నంబిపెరుమాళ్ వారి ప్రార్థనను అంగీకరించి తామే స్వయంగా పుత్రులుగా జన్మిస్తామని వరమునిచ్చెను. తిరుక్కురుగూర్ వచ్చిన పిమ్మట కొద్ది రోజులకు ఉడయనన్గై గర్భమును ధరించెను. సరిగ్గా కలియుగం ప్రారంభమయిన 43వ రోజున ఎమ్పెరుమాన్ ఆదేశము ప్రకారము నమ్మాళ్వార్లు శ్రీమన్నారాయణుని యొక్క దివ్య ఆశీస్సులతో బహుధాన్య సంవత్సరము (ప్రమాది సంవత్సరము), వసంత ఋతువు, వైశాఖ మాసము, శుక్ల పక్ష పౌర్ణమి తిథి, విశాఖా నక్షత్రము నందు (విష్వక్సేనుల అంశగా) జన్మించిరి. ఈ రహస్యము నమ్మాళ్వారే **"తిరుమాలాల అరుళ్ పెత్త శఠగోపన్"** అనగా శ్రీమన్నారాయణుని దివ్య ఆశీస్సులతో విష్వక్సేనుల అంశగ జన్మించిరని తెలియచేసెను. అళగియ మణవాళ పెరుమాళ్ నాయనారులు తమ ఆచార్య హృదయమున ఇలా అనుగ్రహించారు – *"ఆదిత్య రామదివాకర అచ్యుత బాణుక్కళుక్కు నీన్గాధ ఉళ్ళిరుళ్ నీంగి చోశియాధ పిఱవిక్కడల్ చోశిత్తు వికసియాత పోతిల్ కమలం మలరుమ్పడి వకుళబూషణ్ భాస్కరోదయమ్ ఉన్డాయత్తు ఉడైయణన్గైయాగిఱ పూర్వసన్ధ్యైయిలే"* – అనగా ఈ సంసారము నందున్న జీవుల అవివేకము మరియు మాయను, సూర్యుడు ప్రకాశించినను, ప్రజ్వల సూర్యుడిగా కీర్తింపబడు శ్రీరాముడు అవతరించినను, ప్రకాశించు సూర్యుడిగా కీర్తింపబడిన కృష్ణుడిగా అవతరించినను ఆ మాయను తొలగించలేకపోయిరి. నమ్మాళ్వార్ (వకుళభూషణ భాస్కర) తమ అవతారము చేత ఈ బద్ధజీవులకు జ్ఞానమును ప్రసాదించి మాయను తొలగించిరి. ఇలాంటి సులక్షణ సంపన్నులై వైభవం కలిగిన నమ్మాళ్వార్ ను ఉడయనన్గై ప్రసవించినది.

నమ్మాళ్వార్లు తిరుక్కురుగూర్ లోని ఆదినాథ ఎమ్పెరుమాన్ కోవెలలో ఒక చింత చెట్టు క్రింద ఆశ్రయము పొందుతారని ముందుగా తెలిసిన ఆదిశేషులు తామే చింతచెట్టుగా అవతరించి ఆళ్వార్లకు నీడగా ఉంటూ వారిని రక్షించిరి.

**నమ్మాళ్వార్ల తనియన్:**

***మాతా పితా యువతయ: తనయా విభూతి:***
***సర్వం యదేవ నియమేన మదన్వయానాం /***

*ఆద్యస్య న: కులపతే: వకుళాభిరామం*
*శ్రీమత్ తదంఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా //*

వారి అవతార వైభవమును ఇక్కడ చదవవచ్చును.

ఎంపెరుమానార్ తిరువడిగళే శరణమ్
జై శ్రీమన్నారాయణ

సీతా రామాంజనేయ దినేష్ రామానుజ దాస

Source

## *Related*

సేనై ముదలియార్ (విష్వక్సేనులు)In "Acharyas"
శ్రీ వైష్ణవ గురు పరంపర పరిచయం - 2In "Introduction"
ముదలాళ్వార్లుIn "Alvars"